# అథ అష్టమో%ధ్యాయః

## నరకలోక వర్ణనము

చిత్రగుప్త ఉవాచ |

భో భో దుష్కృతకర్మాణః పరద్రవ్యాపహారకాః | గర్వితా రూపవీర్యేణ పీడ్యమానాస్స్వకర్మభిః || 1

యస్త్వయం క్రియతే కర్మ తదిదం భుజ్యతే పునః | తత్కిమాత్మోపఘాతార్థం భవద్భిర్దుష్కృతం కృతమ్ || 2

ఇదానీం కిం ప్రలప్యధ్వే పీడ్యమానాస్స్వకర్మభిః | భుజ్యంతాం స్వాని కర్మాణి నాస్తి దోషో హి కస్యచిత్ || 3

చిత్రగుప్తుడు ఇట్లు పలికెను-

ఓ మానవులారా! మీరు పరద్రవ్యమును అపహరించి, సౌందర్యమును మరియు పరాక్రమమును చూసుకొని గర్వించి పాపకర్మలను చేసినారు. మీరు చేసుకున్న కర్మల ఫలరూపములో ఇప్పుడు దుఃఖముల ననుభవించుచున్నారు (1). మానవుడు చేసిన కర్మకు అనురూపముగా ఫలమునునుభవించును. మీరు ఆత్మవినాశకరమగు పాపకర్మలను ఏల చేసినారు? (2) చేసుకున్న కర్మలచే దుఃఖమును అనుభవించే మీరు ఇప్పుడు ఏడ్చి లాభము ఏమి గలదు? మీ మీ కర్మల ఫలమును అనుభవించుడు. దీనలో ఇతరులు దోషము లేశ##మైననూ లేదు (3).

సనత్కుమార ఉవాచ |

ఏవం తే పృథివీపాలాస్సంప్రాప్తాస్తత్సమీపతః | స్వకీయైః కర్మభిర్ఘోరైర్దుష్కర్మబలదర్పిణః || 4

తానపి క్రోధసంయుక్తశ్చిత్రగుప్తో మహాప్రభుః | సంశిక్షయతి ధర్మజ్ఞో యమరాజానుశిక్షయా || 5

సనత్కుమారుడు ఇట్లు పలికెను-

ఈ విధముగా బలగర్వితులై పాపకర్మలను చేసియున్న రాజులు తమ క్రూరకర్మల ప్రభావముచే ఆ చిత్రగుప్తుని వద్దకు వచ్చిరి (4). ధర్మవేత్త యగు చిత్రగుప్తమహాప్రభుడు కోపముతో నిండిన వాడై యమరాజుయొక్క ఆదేశముననుసరించి వారిని కూడ చక్కగా శిక్షించుము (5).

చిత్రగుప్త ఉవాచ |

భో భో నృపా దురాచారాః ప్రజావిధ్వంసకారిణః | అల్పకాలస్య రాజ్యస్య కృతే కిం దుష్కృతం కృతమ్ || 6

రాజ్యభోగేన మోహేన బలాదన్యాయతః ప్రజాః | యద్దండితాః ఫలం తస్య భుజ్యతామధునా నృపాః || 7

క్వ తద్రాజ్యం కలత్రం చ యదర్థమశుభం కృతమ్ | తత్సర్వం సంపరిత్యజ్య యూయమేకాకినః స్థితాః || 8

పశ్యామి తద్బలం నష్టం యేన విధ్వంసితాః ప్రజాః | యమదూతైర్యోజ్యమానా అధునా కీదృశం భ##వేత్ || 9

చిత్రగుప్తుడు ఇట్లు పలికెను-

ఓ రాజులారా! మీరు అల్పకాలము మాత్రమే నిలిచి ఉండే రాజ్యాధికారము కొరకై పాపకర్మలనాచరించి ప్రజలకు గొప్ప వినాశమును తెచ్చి పెట్టినారు. అట్లు పాపమును చేయుటకు కారణమేమి? (6) ఓ రాజులారా! రాజ్యభోగములయందలి మోహముచే ప్రజలపై అన్యాయముగా బలమును ప్రయోగించి శిక్షించిన దానికి ఫలమును ఇప్పుడు మీరు అనుభవించెదరు గాక! (7) వేటి కొరకైతే పాపకర్మలను చేసినారో, ఆ రాజ్యము మరియు భార్యాపుత్రాదులు ఏరి? వాటిని అన్నింటినీ విడిచిపెట్టి మీరు ఏకాకులుగా నిలబడియున్నారు (8). ఏ బలముతో మీరు ప్రజలను నాశనమొనర్చినారో, ఆ బలము నశించుటను నేను చూచుచున్నాను. ఇప్పుడు మిమ్ములను యమదూతలు కష్టములకు గురిచేయునప్పుడు ఎట్లు ఉండునో? (9)

సనత్కుమార ఉవాచ |

ఏవం బహువిధైర్వాక్యైరుపలబ్ధా యమేన తే | స్వాని కర్మాణి శోచంతి తూష్ణీం తిష్ఠంతి పార్థివాః ||10

ఇతి కర్మ సముద్దిశ్య నృపాణాం ధర్మరాడ్యమః | తత్పాపపంకశుద్ధ్యర్థమిదం దూతాన్ బ్రవీత చ || 11

సనత్కుమారుడు ఇట్లు పలికెను-

ఈ విధముగా యమునిచే పలు వచనములతో నిందించ బడిన ఆ రాజులు మాటలాడకుండగా తాము చేసిన పాపకర్మలను తలచి దుఃఖించెదరు (10). యమధర్మరాజు ఆ రాజుల పాపమనే బురదను కడిగి వేయుట కొరకై కర్మఫలమును నిర్దేశిస్తూ దూతలతో నిట్లనును (11).

యమరాజ ఉవాచ |

భో భోశ్చండ మహాచండ గృహీత్వా నృపతీన్ బలాత్ | నియమేన విశుద్ధ్యధ్వం క్రమేణ నరకాగ్నిషు || 12

యమధర్మరాజు ఇట్లు పలికెను-

ఓయీ! చండా ! మహాచండా! ఈ రాజులను బలపూర్వకముగా తీసుకొని పోయి నరకములోని అగ్నులయందు వరుసగా నియమముతో శుద్ధిని చేయుడు (12).

సనత్కుమార ఉవాచ |

తతశ్శీఘ్రం సమాదాయ నృపాన్ సంగృహ్య పాదయోః | భ్రామయిత్వా తు వేగేన నిక్షిప్యోర్ధ్వం ప్రగృహ్య చ || 13

సర్వప్రాయేణ మహతాతీవ తప్తే శిలాతలే | ఆస్ఫాలయంతి తరసా వజ్రేణ   వ మహాద్రుమాన్ || 14

తతస్స రక్తం శ్రోత్రేణ స్రవతే జర్జరీకృతః | నిస్సంజ్ఞస్స సదా దేహీ నిశ్చేష్టస్సంప్రజాయతే || 15

తతస్స వాయునా స్పృష్టస్స త్రైరుజ్జీవితః పునః | తతః
పాపవిశుద్ధ్యర్థం క్షిపంతి నరకార్ణవే || 16

అష్టావింశతి సంఖ్యాభిః క్షిత్యధస్సప్తకోటయః | సప్తమస్య
తలస్యాంతే ఘోరే తమసి సంస్థితః || 17

ఘోరాఖ్యా ప్రథమా కోటిస్సు ఘోరా తదధః స్థితా | అతిఘోరా
మహాఘోరా ఘోరరూపా చ పంచమీ || 18

షష్ఠీ తలాతలాఖ్యా చ సప్తమీ చ భయానకా | అష్టమీ కాలరాత్రిశ్చ
నవమీ చ భయోత్కటా || 19

దశమీ తదధశ్చండా మహాచండా తతో%ప్యధః | చండకోలాహలా
చాన్యా ప్రచండా చండనాయికా || 20

పద్మా పద్మావతీ భీతా భీమా భీషణనాయికా | కరాలా వికరాలా చ
వజ్రా వింశతిమా స్మృతా || 21

త్రికోణా పంచకోణా చ సుదీర్ఘా చాఖిలార్తిదా | సమా భీమబలాభోగ్రా
దీప్తప్రాయేతి చాంతిమీ || 22

ఇతి తే నామతః ప్రోక్తా ఘోరా నరకకోటయః | అష్టావింశతిరేవైతాః
పాపానాం యాతనాత్మికాః || 23

సనత్కుమారుడు ఇట్లు పలికెను-

అపుడు వారు వెంటనే ఆ రాజులను కాళ్లతో పట్టుకొని వేగముగా తిప్పి పైకి విసిరి మరల పట్టుకొని (13), వజ్రముతో మహావృక్షములను కొట్టిన విధముగా శరీరమునంతనూ కాలుతున్న రాతిపలకపై వేసి మహావేగముతో కొట్టెదరు (14). అపుడు ఆ ప్రాణి చెవులనుండి రక్తము కారుచుండగా శిథిలమైన అవయవములు గలవాడై సంజ్ఞను కోల్పోయి లేశ##మైననూ చేష్ట లేనివాడై పడియుండును (15). అపుడు ఆ ప్రాణిపై గాలి వీచును. వారి వానికి మరల తెలివి వచ్చునట్లు చేసెదరు. తరువాత వానిని పాపములను కడిగి వేయుట కొరకై నరకసముద్రములో పారవేసెదరు (16). భూమికి అడుగున ఏడవ తలము దాటి

ఘోరమగు చీకటితో నిండిన ఇరువది ఎనిమిది నరకకోటులు (శ్రేణులు) గలవు (17). మొదటి కోటికి ఘోర అని పేరు. దాని అడుగున వరుసగా సఘోర, అతిఘోర, మహాఘోర మరియు ఘోరరూప అనునవి గలవు (18). ఆరవది తలాతలము. ఏడవది భయానకము. ఎనిమిదవది కాలరాత్రి, భయోత్కటము తొమ్మిదవది (19). దాని క్రింద పదవది యగు చండ గలదు. అంతకంటే క్రింద మహాచండ, చండకోలాహల, ప్రచండ, చండనాయిక (20), పద్మ, పద్మావతి, భీత, భీమ, భీషణనాయిక, కరాల, వికరాల గలవు. ఇరువదవ స్థానములో వజ్ర అను కోటి (నరకస్థాయి) గలదని మహర్షులు చెప్పుచున్నారు (21) త్రికోణ, పంచ కోణ, సుదీర్ఘ, అఖిలార్తిద, సమ, భీమబల, ఉగ్ర, మరియు ఆఖరులో దీప్తప్రాయ అనునవి ఇరువది ఎనిమిది ఘోరములగు నరకకోటులు. వీటిలో పాపాత్ములు యాతనలను పొందెదరు. నేను నీకు వాటి పేర్లను చెప్పితిని (22, 23).

తాసాం క్రమేణ విజ్ఞేయాః పంచ పంచైవ నాయకాః | ప్రత్యేకం సర్వకోటీనాం నామతస్సంనిబోధత || 24

రౌరవః ప్రథమస్తేషాం రువంతే యత్ర దేహినః |
మహారౌరవపీడాభిర్మహాంతో% పి రుదంతి చ || 25

తతశ్శీతం తథా చోష్ణం పంచాద్యా నాయకాస్స్మృతాః |
సుఘోరస్సుమహాతీక్ష్ణస్తథా సంజీవసస్స్మృతః || 26

మహాతమో విలోమశ్చ విలోపశ్చాపి కంటకః | తీవ్రవేగః కరాలశ్చ వికరాలః ప్రకంపనః || 27

మహావక్రశ్చ కాలశ్చ కాలసూత్రః ప్రగర్జనః | సూచీముఖస్సునేతిశ్చ ఖాదకస్సుప్రపీడనః || 28

కుంభీపాకసుపాకౌ చ క్రకచశ్చాతిదారుణః | అంగారరాశిభవనం మేదో%సృక్ ప్రహితస్తతః || 29

తీక్ష్ణతుండశ్చ శకునిర్మహాసంవర్తకః క్రతుః | తప్తజంతుః పంకలేపః ప్రతిమాంసస్త్రపూద్భవః || 30

ఉచ్ఛ్వాసస్సునిరుచ్ఛ్వాసో సుదీర్ఘః కూటశాల్మలిః |
దురిష్టస్సుమహావాదః ప్రవాదస్సుప్రతాపనః || 31

తతో మేఘో వృషశ్శాల్మస్సింహవ్యాఘ్రగజాననాః |
శ్వసూకరాజమహిష ఘూకకోకవృకాననాః || 32

గ్రాహకుంభీనక్రాఖ్యాస్సర్వకూర్మాఖ్యవాయసాః |
గృధ్రోలూకహలౌకాఖ్యాశ్శార్దూలక్రథకర్కటాః || 33

మండూకాః పూతివక్త్రాశ్చ రక్తాక్షః పూతిమృత్తికాః |
కణధూమ్రస్తథాగ్నిశ్చ కృమిగంధివపుస్తథా || 34

అగ్నిధ్రశ్చాప్రతిష్ఠశ్చ రుధిరాభశ్శ్వభోజనః | లాలాభక్షాంత్రభక్షౌ చ
సర్వభక్షస్సుదారుణః || 35

కంటకస్సువిశాలశ్చ వికటః కటపూతనః | అంబరీషః కటాహశ్చ కష్టా
వైతరణీ నదీ || 36

సుతప్తలోహశయన ఏకపాదః ప్రపూరణః | అసితాలవనం
ఘోరమస్థిభంగస్సుపూరణః || 37

విలాతసో%సుయంత్రో%పి కూటపాశః ప్రమర్దనః | మహాచూర్ణో
సుచూర్ణో%పి తప్తలోహమయం తథా || 38

పర్వతః క్షురధారా చ తథా యమలపర్వతః |
మూత్రవిష్ఠాశ్రుకూపశ్చ క్షారకూపశ్చ శీతలః || 39

ముసలోలూఖలం యంత్రం శిలాశకటలాంగలమ్ |
తాలపత్రాసిగహనం మహాశకటమండపమ్ || 40

సంమోహమస్థిభంగశ్చ తప్తశ్చలమయో గుడమ్ | బహుదుఃఖం
మహాక్లేశః కశ్మలం సమలం మలమ్ || 41

హాలాహలో విరూపశ్చ స్వరూపశ్చ యమానుగః | ఏకపాదస్త్రిపాదశ్చ
తీవ్రశ్చాచీవరం తమః || 42

అష్టావింశతిరిత్యేతే క్రమశః పంచపంచకమ్ |
కోటీనామానుసపూర్వ్యేణ పంచ పంచైవ నాయకాః || 43

రౌరవాయ ప్రబోధ్యంతే నరకాణాం శతం స్మృతమ్ |
చత్వారింశచ్చతం ప్రోక్తం మహానరకమండలమ్ || 44

ఇతి తే వ్యాస సంప్రోక్తా నరకస్య స్థితిర్మయా | ప్రసంఖ్యానాచ్చ
వైరాగ్యం శృణు పాపగతిం చ తామ్ || 45

ఇతి శ్రీశివమహాపురాణ  ఉమాసంహితాయాం నరకలోకవర్ణనం
నామ అష్టమో%ధ్యాయః (8)

ఈ నరకకోటులు అన్నింటికీ ఒక్కొక్కదానికి అయిదుగురు చొప్పున నాయకులు గలరు. ఈ విభాగములలోని నరకముల పేర్లను చక్కగా తెలుసుకొనుము (24). మొదటిది రౌరవము. అచట ప్రాణులు రోదించుచుందురు. తరువాతిది యగు మహారౌరవములో ఎంతటి వారైనా రోదించెదరు (25). తరువాత చల్లని మరియు వేడి నరకములు గలవు. వీటిలో మొదటి ఐదు ప్రముఖమైనవి. ఈ నరకముల పేర్లు ఏవనగా : సుఘోరము, సుమహాతీక్ష్ణము, సంజీవనము (26), మహాతమస్సు, విలోమము, విలోపము, కంటకము, తీవ్రవేగము, కరాలము, వికరాలము, ప్రకంపనము (27), మహావక్రము, కాలము, కాలసూత్రము, ప్రగర్జనము, సూచీముఖము, సునేతి, ఖాదకము, సుప్రపీడనము (28), కుంభీపాకము, సుపాకము, క్రకచము, అతిదారుణము, అంగారరాశిభవనము, మేదఃప్రహితము, అసృక్ ప్రహితము (29), తీక్ష్ణతుండము, శకుని, మహాసంవర్తకము, క్రతువు, తప్తజంతువు, పంకలేపము, ప్రతిమాంసము, త్రపూద్భవము (30). ఉచ్ఛ్వాసము, సునిరుచ్ఛ్వాసము, సుదీర్ఘము, కూటశాల్మలి, దురిష్టము, సుమహావాదము, ప్రవాదము, సుప్రతాపనము (31), మేఘము, వృషము, శాల్మము, సింహాసనము, వ్యాఘ్రాననము, గజాననము, శ్వాననము, సూకరాననము, అజాననము, మహిషాననము, ఘూకాననము, కోకాననము, వృకాననము (32), గ్రాహాఖ్యము, కుంభీనాఖ్యము, నక్రాఖ్యము, సర్పాఖ్యము, కూర్మాఖ్యము, వాయసాఖ్యము, గృధ్రాఖ్యము, ఉలూకాఖ్యము, హలౌకాఖ్యము,

శార్దూలము, క్రథము, కర్కటము (33), మండూకము, పూతివక్త్రము, రక్తాక్షము, పూతి మృత్తిక, కణధూమ్రము, అగ్ని, కృమింగంధివపస్సు (34), అగ్నిధ్రమము, అప్రతిష్ఠము, రుధిరాభము, శ్వభోజనము, లాలాభక్షము, ఆంత్రభక్షము, సర్వభక్షము, సుదారుణము (35), కంటకము, సువిశాలము, వికటము, కటపూతనము, అంబరీషము, కటాహము, కష్టమును కలిగించే వైతరణీ నది (36), సుతప్తలోహశయనము, ఏకపాదము, ప్రపూరణము, ఘోరమగు అసితాలవనము, ఘోరము, అస్థిభంగము, సుపూరణము (37), విలాతసము, అసుయంత్రము, కూటపాశము, ప్రమర్దనము, మహాచూర్ణము, సుచూర్ణము, తప్తలోహమయము (38), పర్వతము, క్షురధార, యమలపర్వతము, మూత్రకూపము, విష్ఠాకూపము, అశ్రుకూపము, క్షారకూపము శీతలము (39), ముసలోలూఖలము, యంత్రము, శిల శకటలాంగలము, తాలపత్రాసిగహనము, మహాశకటమండపము (40), సంమోహము, అస్థిభంగము, తప్తము, చలము, అయోగుడము, బహుదుఃఖము, మహా క్లేశము, కశ్మలము, సమలము, మలము (41), హాలహలము, విరూపము, స్వరూపము, యమానుగము, ఏకపాదము, త్రిపాదము, తీవ్రము అచీవరము, తమస్సు అనునవి (42). పైన ఉదాహరించిన ఇరువది ఎనిమిది నరకవిభాగములో వరుసగా ఒక్కొక్క దానికి అయిదుగురు చొప్పున నాయకులు గలరు (43). రౌరవములో వంద విభాగములు గలవనియు, మహానరకమండలములో నాలుగు వేల విభాగములు గలవనియు చెప్పెదరు (44). ఓ వ్యాసా! నేను నరకముయొక్క స్థితిని చెప్పితిని. దీనిని చెప్పుట వలన వైరాగ్యము కలుగును. పాపాత్ముల గతిని గురించి ఇప్పుడు వినుము (45).

శ్రీశివమహాపురాణములోని ఉమాసంహితయందు నరకలోకవర్ణనమనే ఎనిమిదవ

అధ్యాయము ముగిసినది (8).